ఓం గం గణపతయె నమః
శివాయ గురవే నమః

శ్రీపతి మిము గొల్చి శ్రీయుతుడయ్యేను
వాక్పతిమిముగొల్చి వాక్కు నొందె
అక్షయమ్మునగునుఅమ్మాయనిపిలువ
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 1

మనసుపూల తోట మధ్యమందునకు
సౌధ మొక్కటి గట్టి సౌఖ్యముగను
నిరతము నిను గొల్తు నియమము తప్పక
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 2

జనని విద్య కోరి శరణు వేడెద నిన్ను
నీదు కరుణెమాకు నిత్య రక్ష
అర్ధనారి మాకు అభయమునొసగుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 3

అడగకుండ మాకు అన్నమునిత్తువు
జగతి నున్ననాళ్ళు చలమ వలెను
ధరణి జనుల కీవు తరగని ధనమమ్మ
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 4

మనసు మాల జేసి మాయ తొలగ జేసి
కంఠమందు వేతు కాల రూపి
జ్ఞాన భిక్ష యిడుచు జన్మలు రాకుండ
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 5

ధరణి నున్న నోళ్ళు తనువు పోషించగా
ధనము కావలయును తరగకుండ

ధనమునిచ్చి దాన ధర్మగుణము తోడ
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 6

రోగభూమి తనువు సాగనీయదుదేన్ని
భోగభూమిమనసు పోరు సలుపు
జ్ఞానభూమి బుద్ధి  జ్ఞానవాపివి  నీవు
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 7

జనన మరణ మనెడు చక్ర భ్రమణమన్దు
రోగ భోగ యోగ రాగ మందు
ఆశలెన్నొ కలిగి అంధ కారమె **కలుగు**
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 8

స్వార్థచిత్త మందు శాంతంబుతొలగును
క్రూరకర్మ తోడ కూర్మి తొలగు
**స్వాంత మందు నిన్ను శాశించమనందు**
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 9

కోతి వలెను మనసు కోరునెన్నిం టినో
వలదు యన్న గాని వలపు పెంచు
నీదు పదములందు నిష్ఠ కలుగ జేసి
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 10

త్యాగగుణముయున్న తత్వమ్ముతెలుయును
స్వార్థచింత దాన్ని సాగనీదు
**ధర్మనిరతిపెంచి తనువు తోడను నాకు**

ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 11

బ్రహ్మ వ్రాతతోడప్రాప్తమెంతయొయంత
దాన్ని మించి యేది ధరణి లేదు
ఆశతోడనేమి యరయగల్గుదురిట
ఆర్తి  బాపుమమ్మ అన్న పూర్ణ 12

నిత్యమన్నదాన నియమము కలదాన
నీదు శక్తి నాకు నియతి నిచ్చి
ధరణి జనులబాధ తగనుతీర్చగజూచి
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 13

ఆలు పిల్లలనెడి యను రాగ బంధాన
కట్టివేసి నన్ను కలలొ యుంచి
మోహసంద్ర మందు మునగ చేతువు యేల
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 14

అన్నిచిక్కులెపుడుఅర్థము తోడనె
అర్థమిచ్చి మాకు అభయ మిమ్ము
జనులయందు అమల జయమునిచ్చియెపుడు
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 15

శాఖపాకములవిచక్కగాజేసియు
తేనె తోడకలియుపానీయములు
నీకు యిచ్చి తృప్తినిరతముపొందుదు
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 16

హృదయ మాసనముగనొదవజేసిపిలుతు
స్వర్ణ వర్ణ కిరణ చరణ మిడుచు
పూర్ణ చంద్ర ముఖిపూర్తిపాపము బాపి
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 17

పసిడి రంగు పూలు పరమాన్నములు పళ్ళు
చెరకు రసముతోడ చేర్చి మిగుల
మనసు తీర నీకు  మరి మరి  నర్పింతు
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 18

పద్మ మధ్యమన్న పసిడి గద్దె మీద
కూర్చునుంటివీవు కూర్మి మిగుల
విశ్వమునకు  మాయ వీడగా జేయుచు
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 19

సృష్టికర్త కపుడు పుష్టి నీయగనీవు
వాణి యయ్యి నతని వాక్కు నిలచి
జగతి గతులు జూపి జరిపితె సృష్టిని
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 20

**మాయరూపమందుహయగ్రీవునొందుచు**
నసురసంహారమందునవధరించి
లక్ష్మియయ్యి జనుల రక్షిణిచ్చినావుగ
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 21

శివుడె నీవు నీవె శివుడందురందరు
నీవు లేనినాడు శివుడు లేడు
శివునిశక్తి వీవు చిన్మయ రూపిణి
ఆర్తి బాపు మమ్మ అన్నపూర్ణ 22

అన్తరంగ జలమునభిషేకమొనరింతు
మనసు పూలతోడ మాలవేతు
నయముతోడ తనువు నైవేద్యమిడుదును
ఆర్తి బాపు మమ్మఅన్న పూర్ణ 23

స్వర్ణ కిరణ జాల స్తంభ తోరణ మందు
మణులుపొదిగియున్న మంచి గద్దె
అభయ వరమునీయ అమ్మని స్సేవింతు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 24

పసిడి యంచు కలుగు పచ్చచీరను గట్టి
కడిమిపూలఛాయ కంచుకముతొ
కాలి యందె రవళి కలిగించి సంపద
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 25

**అగ్ని రగులు చుండె నలుబది రెండేళ్ళ**
**శిక్ష చాలునమ్మ సిరులనిమ్ము**
**ధర్మ నిరతినెపుడు ధరణివిడవకుండ**
**ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 26**

**సవతి తల్లి చేయు సమరము చూచితే**
**సత్యధర్మ నిరతిసరిగ లేక**

మోసపుచ్చె తనదు మోహముమీరగ
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 27

వెలితిగుణము కలిగి వెక్కిరించు నరులు
చుట్టుయుండ కుండ చూడు మమ్మ
నన్ను నమ్ము వారు నాకు గావలయును
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 28

అష్టదిక్కులు నీకు అణకువతోనుండి
సకల కార్యములలొ సరిగ నిలచి
సృష్టికార్యమందు సృజనతో చరియించు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 29

మానవుడిని గాన మనిషిగా నోజింతు
దైవగుణము నాకు అర్ధమగునె
భయము తొలగజేసి భ్రాంతి లేకనుజేసి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 30

మునులు ఋషులు తపసి ముఖ్యులందరెపుడు
నిన్ను గాంచ మదిని నిష్ఠతోడ
తపము చేతురెప్పుడు దయను వారిని గాచి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 31

తపము తెలియ నేను తాపసిని గానమ్మ
ఋతము అనగ నాకు ఋజువు లేదు
మనసు చంచలతను మాన్పగ లేకుంటి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 32

మనసు మర్కటమ్ము మాటవినదసలు
నిగ్రహమ్మునిచ్చి నిలుపు ధరను
నీదు పదములందు నిశ్చల బుద్ధిచ్చి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 33

ఈర్ష్య కలుగు నరులు యీసడింతురెపుడు
మూర్ఖ జనుల తుద ముట్టజేసి
మంచి వారినెపుడు మన్నింతువనితల్లి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 34

విద్య లేని వాడ విజ్ఞాని గానమ్మ
ధనము లేనివాడ తగను అరసి
ధనము విద్య దయను తరగకుండనిచ్చి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 35

సకల శాస్త్రములకు సారమ్మునీవయె
సకల జీవు లందు సత్వమీవ
సకల విద్యలన్ని చక్కగామాకిచ్చి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 36

జాతి కుల వర్ణ ఛాయలు లేకుండ
సకల జీవ తతుల చక్కజేసి
ప్రేమ యనగ నేమొ యిష్టముగా నేర్పించి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 37

కామకో పమోహ కర్మ జలధి మున్గి
మదము మత్సరమ్ము మనసునుండి
మనిషి యిలను మంచి మరచి నాడదిగాంచి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 38

జనన మరణ మరణజనన భ్రమణ మన్దు
పాప పుణ్య కర్మ ఫలము యెంతొ
యంత యనుభవించి నలయును జీవుడు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 39

పూర్వ కర్మ ఫలము పుణ్యము పాపము
అనుభ వించ వలయు నంత యిచట
కరుణ తోడ మాదు కర్మలు కరగించి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 40

చావుపుట్టుకలను చక్ర భ్రమణమందు
మనిషి జన్మ యుత్తమనియుతెలసి
మోహ జలధి మునిగి మోసపోవు నరులు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 41

జాతి భేధమేమి చర్చించ కుండగ
కులమతములు యన్ని కూల్చి వేసి
మా నవకులమొక్కటి మంచిగా నిలుపుచు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 42

కోతివంటిమనసు కోరునెన్నింటినో
ఆశ యున్న దాని అంత మెచట
లోన శతృచయము లొంగచేయునెపుడు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 43

అన్ని నాకు తెలిసు ననుచుపండితుడెప్డు
విర్రవీగి కనడు విలువనింత
నిన్ను తెలుయు చదువు నిజము తెలియకుండ
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 44

చదువు యనగనేమి అక్షరజ్ఞానమా?
అర్థతలను జూపు కాగితములె?
ఆత్మ నెరిగిమసలు జ్ఞానము నిచ్చుచు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 45

నేను నాది యనుచు నిక్కును నరుడెప్డు
ఏది వీని స్వంతమేది నిజము
జ్ఞాన భిక్ష నిడుచు నరుల సరిజేసి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 46

దేహమున్ననాళ్ళు తెగబడి సాధించి
పరుల పాలు జేసి పాపి చచ్చు
వానిసాధనంత వదిలిపోవునిచట
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 47

నరకమున్నదని నాయనమ్మలు చెప్పె

స్వర్గమున్నదని సాధువనియె
స్వర్గ నరకమనిన **స్వాంతమున భయము**
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 48

ఇహాపరముల చర్చ ఇంగిత జ్ఞానికి
బుద్ధి హీనుకేది భూమి మీద
కుడవయున్న చాలుకూల్తురు నన్నింటి
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 49

ఆకలన్న యింత అన్నమిడుచునెప్డు
జ్ఞానహీను జూచి జ్ఞానమిచ్చి
జనన మరణబాధ చర్చ లేకనుజేసి
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 50

పాపకర్మఫలము శాపముగాపొంది
సంతు పొంద లేరు సరిగ జనులు
వారి కర్మ బాపి వరమునిచ్చి యికను
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 51

చమురు లేని జ్యోతి చక్కగా వెలుగునె
నీవు లేని నేను నిజము  లేను
నీదు కరుణ తోని నిత్య జేయుచు నన్ను
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 52

అహము వలననరుడు అంధకారముపొందు

అహము వీడినంత ఆత్మకనును
అహముకలుగకుండ అంతరంగమునందు
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 53

కుబుసమిడిచి పాము కొత్తగా మెరయును
మాయకమ్మి మనిషి మంచిమరచు
మాయవిడగ జూచి మహిమాన్వితుజేసి
ఆర్తి బాపుమమ్మ అన్నపూర్ణ 54

ఎంత జ్ఞాని గాని ఏమి చదివిన గాని
మరణ కాలమందు మాయ విడదు
మనిషి నిన్ను తెలియ మనసున కలిగించి
ఆర్తి బాపుమమ్మ అన్నపూర్ణ 55

చివరిక్షణ మనిషి చింతించు దానిని
మరల జన్మ మందు మహిని పొందు
చివరికాలమునీదు చింతన కలిగించి
ఆర్తి బాపుమమ్మ అన్నపూర్ణ 56

ధరణినున్నవాళ్ళు ధర్మము విడకుండ
ధనమునిచ్చి నెపుడు తరగకుండ
ఋణవిముక్తుజేసిఋజుమార్గమునుజూపి
ఆర్తి బాపు మమ్మ అన్న పూర్ణ 57

కరుణ దాన భక్తి కనగ వైరాగ్యమ్ము
శాంతి దాంతి విద్య స్వాంతమందు
కలుగజేసిమాకు కారుణ్యభావాన

ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 58

కామచింతనమ్ము కలిగికనలకుండ
ఆశ మదిలొపెరిగి యణచకుండ
నీదు పదములందు నిత్యధ్యానమయిచ్చి
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 59

కనులు మూసినంత కనపడు కామ్యమ్ము
కామ శక్తిముందు కరగు భక్తి
చిత్త శాంతి నిచ్చి      చిన్మయ ముద్రిచ్చి
ఆర్తి బాపు మమ్మ  అన్న పూర్ణ 60

లోకమందుకనగలోచనములుచాలు
నిన్నుకనుటకెపుడు నిష్ఠవలయు
నిత్య నిష్ఠ జేసి నిర్మల భక్తిచ్చి
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 61

ఆలుపిల్లలాస్తి అన్నిపూర్వపుపుణ్య
ఫలమె యనగ వింటి  పాపపుణ్య
కర్మలన్నిజూచి  కార్యజయమునిచ్చి
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 62

ఋణమువ్రణమురణమురుచులుజూచితినమ్మ
ఋణములన్నితీర్చిఋతముదెల్పి
వంశవృద్ధి యిపుడు వరముగా నిచ్చుచు
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 63

భిక్ష అడుగనర్థి భిక్ష యిత్తువెపుడు
రక్ష కోరుకున్న రక్షణిచ్చి
భక్త జనుల మదిని భావనాపటిమిచ్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 64

సంతులేనివార్కి సంతానమునుయిచ్చి
ధనము లేని వార్కి ధనమునిచ్చి
ముక్తి కోరు వార్కి మోక్షము నిచ్చుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 65

ఎవరు నేను యిటకు ఎచటినుండొచ్చితి
ఏమికారణంబు ఏది నిజము
జనన జ్ఞాన మిచ్చి జాగృతి కలిగించి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 66

అరయ నీదుచూపు అరక్షణమది చాలు
ఋణవిముక్తుజేయుఋజువుగాను
ఈర్ష్యసూయ ద్వేషమీసడింపులుగాల్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 67

మనసు మలిన మైన మాయయెట్లుతొలగు?
మలినమనసుకడిగి మాయమాన్పి
మీదుపాదమందు మిక్కిలి భక్తిచ్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 68

నాల్కయెరుగురుచి నయనమెరుగురూపు
మనసుయెరుగు యెదుటిమనిషిమనసు

తననుతానుయెరుగు తత్వమ్ము తెలుపుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 69

అక్షరమ్ముతెలియనాత్మజ్ఞానినిగాను
తత్వమంతనెరుగతపసి ాను
ఋచులుయన్నిమాన్పిఋషి ్నుననుమార్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 70

విషయజ్ఞానమెరుగ విజ్ఞునిగానమ్మ
కుక్షినిండకున్న గూలివోదు
లక్ష్య మేమొ దెల్పి అక్షయ శక్తిచ్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 71

కనగ నిలను మాయ కామినీ కనకమే
కామమదియె మనసుకమ్మునెపుడు
కామముడగ జేసి కారుణ్య భావాన
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 72

భక్త జనులకెపుడు భాగ్య జీవనమిచ్చి
భక్తి యోగ మిచ్చి బరువు దించి
మోహమంతద్రుంచి మోక్షమ్మునిచ్చుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 73

అరయ జీవనమ్ము యాంత్రికమ్మయినది
యంత్ర జీవితాల యాతనెంతొ
తంత్ర యంత్ర మంత్ర తతులను ద్రుంచుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 74

నరుని జీవితాన నాణ్యత గోల్పోయి
తననుతానెరుగకధరణినిల్చె
తనను తానెరిగెడి తత్వమ్ము బోధించి

ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 75

కలలు కనగ వచ్చు కామన కలగొచ్చు
భోగమనుభవించిబొగలవచ్చు
ఎట్టి నరున్కైన ఎరుకగావలయును
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 76

తల్లి తండ్రి గురువు తనకు కనపడెడి
దైవములని నరుడుతలువవలయు
ఇలను యిట్టి ధ్యాస ఇంపుగా గలిగించి
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 77

పక్షి వృక్ష ఋక్ష కుక్షినింపుదు వీవు
కన్నతల్లి ప్రేమ కనకతల్లి
సకల జీవజాల సంతోషమీవందు
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 78

విన్నవించుచుంటి వినతులెన్నింటినో
నీకువిసుగుపుట్టనిజముతల్లి
మనసునందు యెన్నొ మాటలున్నవితల్లి
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 79

పూర్వకథలుగాని పుణ్యపురుషులగాని
తీర్థరాజమహిమతీరుగాని
అసలు యెరుగ తల్లి  అజ్ఞానినమ్మరో
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 80

తర్క శాస్త్రమనెడి  తంత్రమెరుగనమ్మ
వాక్యనియతియసలువరుసనెరుగ
ఛందసందునాకు చలనమే లేదమ్మ
ఆర్తి బాపుమమ్మ  అన్న పూర్ణ 81

నేనుమిథ్యగాని నీవునిజమనందు
నేను నీదునీడ నిక్కమింతె
నీకు నాకు మధ్య నియతి చెరిపితల్లి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 82

నాలొ నిన్ను జూచి నయముగ వచియింతు
నీలొ నుందు నేను నిజము తల్లి
నీకు నాకు తెలియునిది నిశ్చయముగాను
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 83

తెలియలేనిబాధ తీరునుతెలుపమ్మ
వెలితిగుండెలోన వలుగునింపి
మార్గమేదొ జూపి మహిలోననిల్పుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 84

నీదుపదమునాకు నిక్కంపు పాత్యమై
నీదునామజపమునియతినిచ్చి
నిజనివాస వాస నిత్య యోగమునిచ్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 85

వృక్ష తతుల పైన పక్షులకాహార
మిడుదు జలమునందు మీనతతికి
ఎవరికెపుడు యేది యేవిధిగనిడుదో
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 86

భావమందునిలచి భావనాపటిమిచ్చి
కలమునందునిలచికళలనిచ్చి
వాక్కులోననిలచి వాక్సిద్ధినిచ్చుచు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 87

చలన శక్తివీవు జడశక్తి వైదువు
నీదుపూర్ణరూపునియతిజూపి
జగతినున్ననాళ్ళుజయముకలుగజేసి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 88

స్వాంతమందుయున్నసంగతిచాలుంది
గుర్తుకొచ్చినంతగుణిగితిపుడు
మనసునున్న దానిమానమంత నెఱిగి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 89

హృదయమందుకలుగు హృదయవేదనయంత
విన్నవించుచుంటి వినుము తల్లి
భిక్ష యిత్తు వనుచు భీతిలేకనుయుంటి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 90

మనసునున్నమాటమరిమరివినిపింప
మాయచేయకుందమంచికోరి
మనసువిప్పిజెప్పమన్నించరెప్పుడు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 91

కామ్వైరిసేవ కాయమున్నయపుడె
మనసుతీరజేయ మాయతొలగు
కామజయమునిచ్చి కావుచుమమ్ముల
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 92

సర్వతీర్థజలము సంగతంతయునీవె
ప్రాణమానధనమపుభావమీవె
నీదుచరణదాసు నిరతము రక్షించి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 93

మాటనాదియగును మార్గమీవెయగుదు
వ్రాతనీదెయగునువరమునీయ
కన్న తల్లివి కద కావలసినది యిచ్చి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 94

జీవ శక్తి నాదు చేతి లోననిలిపి
శిష్య వర్గమందు చింతదీర్చి
దివ్య జ్ఞానమిచ్చిదీవించినన్నెప్డు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 95

మనసులోన నిన్ను మరిమరితల్వగ
కనులముందునిలిచికావుమమ్మ
అరుణకిరణచరణ నాపైకరుణజూపి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 96

పసుపువన్నె చీరె పసిడియంచు రవికె
స్వర్ణపాత్రయందు స్వాదురసపు
పాయసంబునిడుచు పసిడిగరిటెతోడ
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 97

నీచజనులతోడ నిత్యకర్మలయందు
ఎన్నొచిక్కులొచ్చుయెందువలన
కూలివారులేక కుదరదు కార్యమ్ము
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 98

చదువుకొన్నగాని సంస్కారమదిలేక
ఈర్ష్యతోటిజనులుయిలనుబ్రతుకు
శాంతబుద్ధినిచ్చి శాసించిజనులను
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 99

అడుగుఅడుగునందు యాటంకములుకల్గ

అంతనీవెయనుచుయనుకునుంటి
కార్యజయమునిచ్చి కావుచుమమ్ముల
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 100

నిత్యకర్మలందు నిన్నెతలచుచుందు
సర్వకాలమందు చక్కగాను
విఘ్నములను నీవువిడగొట్టిరక్షించి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 101

నాతొమేలుపొందినన్నెనిందింతురు
కుళ్ళుబుద్ధివారు కుటిలమతులు
వారిపీడమాకువారించి; కాపాడి
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 102

నిందలెన్నొమోసి నిస్త్రాణనొందితి
స్వార్ధపరులనుండి చవటనుండి
ధైర్యమొసగినన్ను దరిచేర్చుకొనుచిష్టు
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 103

విశ్వనాథశర్మ వినతులెన్నియొవిని
కనుచువీనికవన కథలనిపుడు
తప్పులున్నచోట తగువిధమునదిద్ది
ఆర్తి బాపుమమ్మ అన్న పూర్ణ 104

తనయమొగునిబుద్ధితగినట్లుదిద్దుచు
మంచివాక్కునిచ్చి మమతపెంచి
కీలు తిప్పి వాన్కి కీర్తికలుగ చేసి
ఆర్తిబాపుమమ్మ అన్నపూర్ణ 105

తనయునికికతగినతరుణితోడునుయిచ్చి
ధనమునిచ్చిమంచితనయునిచ్చి
దిగులులేకచేసిదీవించుచెప్పుడు
ఆర్తిబాపుమమ్మ అన్నపూర్ణ 106

పుత్రమిత్రబంధుపౌత్రులందరునెప్డు
కలిసిమెలిసిబతుకుగడపునట్లు
తీర్చిదిద్ది వార్చిదీవించుచెప్పుడు
ఆర్తిబాపుమమ్మ అన్నపూర్ణ 107

నీదుకరుణతోడ నిత్యజీవనమున
కలుగు కష్టములను కరగజేసి
శాంతికలుగజేసి శాసించుచెప్పుడు
ఆర్తిబాపుమమ్మ అన్నపూర్ణ 108

<u>**ఇతిశమ్**</u>

ములుగువిశ్వనాథశర్మ
విశ్వనాధుని సతివి కోర్కెలీడేర్చుగతివి,
విశ్వనాధుని ముల్గువార్ధిసముద్భవుని
జాగ్గసేయకా మమ్ముకావుమమమ్మ